సంపుటము 3] జూన్ 1917 [సంచిక 12

# బాలమిత్ర



## సముద్రము

గాలీ వానా వచ్చినకొలదీ ♦ చాలా సందడి చేయునదీ.
2. సందడి చేసే కెరటముకొలదీ ♦ అందముగా పైకుబ్బునదీ.
3. కెరటము లుబ్బుచు వచ్చినకొలదీ ♦ నురుగులు ఒడ్డున కక్కునదీ.
4. నురుగుల కెరటము విరిగినకొలదీ ♦ ఉరుముల వలెనే అరచునదీ.
5. అవతల దరికై చూచినకొలదీ ♦ ఆకాశముతో కలియునదీ.
6. జాలరివాళ్లూ పట్టినకొలదీ ♦ చాలా చేపలు ఇచ్చునదీ.
7. దూరముగా మరి పోయినకొలదీ ♦ నీరు మెండుగా ఉండునదీ.
8. నీరు మెండుగా ఉండినకొలదీ ♦ నీలపు వర్ణము కలిగినదీ.
9. వర్ణన ఎంతో చేసినకొలదీ ♦ వర్ణన కింకా ఉండునదీ.

# రాంబందు గూటిలోని పిల్లవాడు



ఇంగ్లాండుదేశపు రాజగు ఆల్‌ఫ్రెడ్ చాల మంచివాడు. దయగల శూరుడు. తన దేశక్షేమమునకై బహు పాటుబడెను. ఇతరుల కష్టములలోకూడ తోడ్పడువాడు. ఆయన చేసినకార్యములను ఇతరులకు తెలియనిచ్చువాడు కాడు. వాని నితరులు కనుగొన్నయెడల విచారపడువాడు.

ఒకనా డాయన గుఱ్ఱపుసవారి చేయుచుండెను. వెంట కొందరు శూరులుండిరి. వారు కొంతదూరము పోవుసరికి ఆయున కొక వింతైనశబ్దము వినవచ్చెను. "ఏమిటాధ్వని పిల్లవానియేడ్పువలె నున్నదే. వెళ్లి ఏమిటో చూడుడ"ని

వారితో జెప్పెను. వారువెళ్లి ఎంతవెదకినను ఏమియు కనుపడ లేదు. "అయ్యో! ఇక్కడే బిడ్డ ఏడ్పువినవచ్చును? నిర్జన ప్రదేశముగదా! అంతయు వెదకితిమి ఏమియు కనుపడలేదే యు"ని ఒకడు చెప్పెను.

"లేదు. లేదు. నేను విన్నాను. అది నిజము" అని ఆ శబ్ద మెక్కడనుండి వచ్చినదోయని పరికించుచు అటునిటు జూచెను. ఏమియు కనుపడనందున అక్కడనుండి వెళ్లబోవు నంతలో మరియొకమా రా శబ్దము వినవచ్చెను. తాను నిలువబడియున్న స్థలమునకు పైగానున్న చెట్లకొమ్మలనుండి వచ్చిన ట్లూహించి, "పైన కొమ్మలలో వినబడుచున్నది. త్వరగా ఎక్కిచూడుడ"ని వారి కాజ్ఞాపించెను. వా రదేలాగు వెళ్లి, పై కొమ్మలలోనున్న యొకగూడునందు ఏడ్చుచున్న పసి బిడ్డనుచూచి, క్రిందకు తెచ్చిరి.

వానిపై మంచిబట్టలుండెను. చేతులకు బంగారు మురుగులు గలవు. ఆ బిడ్డ ఎవరో గొప్పవారిబిడ్డవలె కనుపడెను, గాని అక్కడ కెట్లువచ్చినది?

రాజుగా రా బిడ్డను తీసికొనివెళ్లి తన నగరిలో పెంచిరి. వాని తల్లిదండ్రులను కనుగొనుటకు దేశమంతటిలోకి మనుష్యులను పంపెనుగాని, ఎంతవెదకినను వారిని కనుగొనలేక పోయిరి. "సరే అట్లయితే, వానిని నేనే పెంచుకొంటాన"ని

రాజుగా రనెను. వానిని రాజబిడ్డవలె పెంచిరి. అతడు గొప్పవాడై, మంచి వీరుడయ్యెను. రాజుగారికి చాల సహాయము జేసెను.

## చుట్ట త్రాగుటవల్ల కలుగు హాని

సుమారు పదిరెండేండ్ల బాలు డొకడు చుట్టత్రాగు దురభ్యాసమునకు లోబడియుండినాడు. అయితే తాను సిగరేట్ పొగపీల్చుట పోలీస్‌వారు జూచిన తన్ను పట్టి శిక్షింతు రని భయపడి ఎవరులేని యింట జేరి యొక చిన్న పిల్లవానితో సిగరెట్లు తెప్పించుకొని ఉపయోగించుచుండెను. వీడు చనిపోగా వైద్యులు వీని పరీక్షించి చుట్ట త్రాగుటవల్లనే వీ డకాలమరణము నొందెనని నిర్ధారణ చేసిరట!

## అజ్ఞానపు గుహ

విక్కిలి చీకటిగానున్న యొక గుహలో కొందరు మనుష్యులు జీవించుచుండిరి. అచ్చట వారు తమ యిష్ట ప్రకారముగాక, బలవంతముగా గొలుసులతో కట్టబడి

యుందుంచబడిరి. మిగుల వెడల్పుగానున్న యా గుహాముఖ మునకు దూరముగా బయటవేయబడు నుంటచేమాత్రమే లోపలికెప్పుడైన నొకసారి వెలుగు వచ్చుచుండునది. ఈ గుహయందున్న మనుష్యుల వీపులు గుహద్వారము తట్టుండు నట్లు గొలుసులతో కట్టివేసియున్నందున, బయట లోకమునం దేమిజరుగుచున్నదో కొంచెమైనను వారికి తెలియకుండెను. ఎవరైన ఆ గుహమీదుగాబోవుట తటస్థించినయెడల వారి నీడలీ వెలుగువలన వీరికెదురుగానుండు గుహగోడమీద బడు చుండునవి. గాన గుహలోనున్న ఖైదీలు గోడమీదబడు నల్లని వికారరూపములనుజూచి లోకమంతయు నిట్టి నీడలచేనిండి, నివసింపబడుచున్నదని నమ్మిరి.

ఒకసారి పొరపాటున వారిలోనొకడు ఆ గుహనువిడిచి బయిటకువచ్చుట తటస్థించెను. అంధకారములోనుండి ఎండ లోనికి రాగానే వానికండ్లు మిరుమిట్లుగొనెను. బలహీనతచే వాడు తొట్రిల్లెను. క్రమక్రమముగా వానికండ్లు వెలుతు రును భరింపగలిగెను. చుట్టునున్న వస్తువులన్నిటి రంగులను తెలిసికొనగలిగెను, లోకమెట్టిదో వాడు నేర్చుకొనెను. వాడు తిరిగి తనవారియొద్దకు వెళ్లవలసివచ్చెను. అచ్చటకు బోయి నప్పుడు లోకముయొక్క నిజమైన స్థితినిగూర్చి వారికిజెప్పెను. అప్పుడు వారేమి జేసిరనుకొంటావు.

నవ్వి ఎగతాళిజేసిరి. లేవిడీలుకొట్టిరి. కొంచెమైన నమ్మలేదు. ‹‹ వీడికి పిచ్చిబట్టినది. లోకమెట్టిదో మనకు తెలియక పోతేగదా. వీడు చెప్పినదంతయు అబద్ధము ››ని చెప్పుకొనిరి.

ప్రియపిల్లలారా! మనలో నెంతమంది మిట్టిగారము కాము? అందువలన మనము చేయుకీడు లెంతచెడ్డవో తలంచితిరా? మనచుట్టునున్న ప్రపంచములో నున్నవాటినిగూర్చి నేర్చుకొనుటకు, యితరులకు వానిని దెలుపుటకు ప్రయత్నింతము.

---

## దానమ్మఅంటే అందరికేల ఇష్టము?

ఒక ముసలాయన తన గ్రామములోనున్న ఆడపిల్లల కందరికిని తమాషాజేసి పిలిచెను. అందరును వచ్చినప్పుడు ఆటలాడించినపిదప, అందరెవరినెక్కువగా ప్రేమించిరో ఆ పిల్లకు ఒక చక్కనిబొమ్మ నిత్తుననిచెప్పెను. అప్పుడందరు దానమ్మనని చెప్పిరి. దానమ్మ వారిలో అందకత్తెగాని, తెలివిగలదిగాని కాదు. ఆమెకు బొమ్మనిచ్చినపిదప, అతడు మీకందరికి దానమ్మ ఎందుకిష్టమో చెప్పిన మొదటివారికి మరియొకబొమ్మ నిత్తుననెను. మొదట ఎవరును చాలసేపటి వరకును చెప్పలేదు. చివరకొక చిన్నపిల్ల లేచి, ‹‹ మాలో

ఎవరైనను ఆడుకొనగోరితే ఆమె తెలిసికొని వెంటనే మనము ఆడుకొందమని చెప్పను" అనెను.

ఇతరులుగోరిన దానిప్రకారము చేయువారి నందరు ప్రేమింతురు.

---

# ప్రకృతి పాఠములు

## 34 వ-పాఠము

## ఎముకలు

(గతసంచిక శేషము)

మనము వెన్నెముకయని జెప్పునది ఒక్కటే ఎముకగాక అనేక ఎముకల చేరికయైయున్నది. 24 ఎముకలను ఒకదానిపై నొకటిబెట్టిన స్తంభమువంటిదిగా నున్నది. అది అంతయు ఒక్కటేఎముక అయినయెడల నీవిప్పుడు వంచు చున్నట్లు నీ శరీరమును వంచజాలవు. ఎవరికైనను వంగి నమస్కారము జేయువలసినప్పుడు వీపునువంచ వీలుకాదు. ఆలాగు వంగినప్పుడు నీ వెన్నెముకలోని 24 ఎముకలలోను ప్రతి రెంటిమధ్యను చలనము కలుగును. ఈ ఎముకలన్నిటి గుండ ఒక కాలువగలదు. ఈ కాలువలో మెత్తటి తెల్లని పదార్థమున్నది. దీనిగూర్చి తరువాత దెలిపెదను.

ఈ వెన్నెముకపైని తల ఉంచబడియున్నది. నీ తలను అటుఇటు త్రిప్పినప్పుడు ఈ ఎముకల స్థంభముపైనఉన్న చివరి ఎముక మీద కదలుచుండును.



ఎముకలు ఒకదానితోనొకటి చేర్చబడియున్నవి. ఈలాగు చేరినస్థలమున కీలు అందురు. మన శరీరమున లెక్కలేనన్ని కీళ్లుగలవు. నీ శరీరమెచ్చటవంగునో అచ్చటెల్ల కీలుగలదు. ఈ కీళ్లు అన్నియు నొకేరీతిగా లేవు. కొన్ని గిన్నెలో నుంచబడిన బంతివలెనున్నవి. ఇంక కొన్ని మడత బంతివలె నుండును. కొన్ని బొంగరమువలె నుండును. భుజమువద్దను నడుమువద్దను బంతిగిన్నె కీలు గలదు. ఇక్కడ చేతులుగాని కాళ్లుగాని కొద్దిగానో గొప్పగానో గుండ్రముగా దిరుగును. మోచేతియొద్దను, మోకాలుయొద్దను మడత బంతివలె వెనుకకు ముందుకు కదలించ వీలున్నది. మెడయొద్ద బొంగరమువలె నాడించుటకు తగిన రీతిగా నమర్చబడియున్నది.

చేతులయందును కాళ్లయందును అనేక ఎముకలున్నవి. ఏల? చేతులు అనేకపనులను చేయవలసియున్నవి. గాన అవి అన్నిదిక్కులకును త్రిప్పగలుగునట్లు అమర్చబడి

యున్నవి. అయితే కాళ్లయందన్ని ఎముకలేలయని అడుగ వచ్చును. అన్ని ఉండనియెడల నడుచుటకుగాని పరుగెత్తుటకు గాని వీలుండదు.

ఆయాజంతువుల ఎముకలు వాటివాటిపనులకు దగినట్లుం డును. ఎక్కువ కష్టపడిచేయువానికి గట్టివైన లావుఎముక లుండును. అంత ఎక్కువపనిచేయ నగత్యములేనివాని ఎము కలు తేలికగాను, మెత్తగానుండును.

(సశేషము)

---

## పాములెట్లు నడుచును?

ఆయా జంతువులనుగూర్చి మనమెట్లు వింతపడుదుమో, అవికూడ అప్పుడప్పుడు మనలనుజూచి తలంచునేమో ఎరుగము. గాని అట్లు అవి తలంచగలిగిన యెడల బహు వింతపడునని తోచుచున్నది. ఒకొక్కప్పుడు మనము వాటి అల వాటులను చూచినప్పుడు వానినిగూర్చి యబ్బురపడి అవెంత వికార మృగములాయని తలంతుము. దృష్టాంతముగా చాల మంది పాములెట్లు నడుచునో ఆ విషయమునుగూర్చి బహు తమాషాభిప్రాయముల గలిగియున్నారు. పాములును మన

వలెనే తలంచగలిగి యున్నయెడల, అవి మనము మన వీపుతో నడుచుచున్నామని తలంచునేమో.



కొంత కాలముక్రిందట నేనొక చిన్నదానితో మాట్లాడు చుంటిని. ఆమె పల్లెటూరియందున్న తనబంధువులను దర్శింప వెళ్లెను. అక్కడుండునప్పుడు పొలములో నొక పామును చూచెను. ఆమె తాను చూచిన పామెట్లు రోడ్డుమీదుగా పారిపోయెనో బాగుగా కనుపెట్టెనట. పొడుగాటి త్రాటి చివరి నొక చిన్న మొక్కకు కట్టి రెండవ చివరను పట్టి పైకి క్రిందకు ఆడించిన నెట్లు కదలునో అట్లు కదలిపోవునని చెప్పినది. దాదాపుగా అందరు అదేలాగున తలంచవచ్చును. గాని అట్లు కానేకాదు. నేను చూచిన పామునెట్లు పట్టు కొంటినో చెప్పెదను. అప్పుడు పాము లెట్లు నడచునో గ్రహింపగలవు.

నేను పట్టుకొన్న పాము గడ్డిలో దాగియుండెను. అది బహు నెమ్మదిగా పరుండి యున్నట్లు కనుబడెను గాని దాని తలను, దాని కండ్లను చక్కగా చూడగలిగితిని. దాని పట్టుకొనవలెనని దగ్గరకురాగానే అది నన్నుచూచి పారిపోయెను. అప్పుడు దానిచూచి యున్నయెడల చక్కగా గ్రహించి యుందువు. నేలపైనున్న కరుకు ప్రదేశముల మీదుగా నది పరుగెత్తెను. అందువలన దానిని కలిసికొనలేకపోతిని. పోయి పోయి అది ఒక బురదగుంటలో ప్రవేశించెను. దానిలో నీరు లేదు. వట్టి బురద యుండెను. అదంత లోతుగా నుండకున్నను దారుడుగా నుండెను. అది బహు వడిగా పోవుచున్నందున, తోకమట్టుకు బురదలో కూరుకొని పోవునంత వరకు దానికి తెలియుకపోయెను. తరువాత ఒక బెత్తెడైనను ముందుకు పోలేకపోయెను. చాల ప్రయత్నము చేసినపిమ్మట దానిలోనే ఒక తరహాగా చుట్టచుట్టుకొని పడియుండెను. త్రాటివలెనే వంకర టింకరగా కదలెను గాని పైకి క్రిందకు కాక ప్రక్కనుండ ప్రక్కకు కదలెను.

నేను దానిని పట్టుకొని దాని కాళ్లకొరకు తడవిచూడగా దాని కడుపుక్రింద పెద్దపెద్ద పొలుసులుండెను. అవి వదలుగా నుండినందున వాని మధ్య బురద కూరుకొని యుండెను. అక్కడ బురద యెందు కుండవలెనా యని తలంచితిని గాని

నాకేమియు తోచలేదు, గాని దానిని క్రిందకు వదలగానే అది తన తలను అటు ఇటు త్రిప్పి కరుకు ప్రదేశమును కనుగొని ఆ పొలుసులతో ఆ ప్రదేశము నడిమి తోకను చాపెను. తోక పొలుసులతో ఆ కరుకు ప్రదేశము పట్టుకొని మెడను చాపి ముందుకు బోయెను. ఇట్లు అది ముందుకు పోగలిగెనని తెలిసి కొంటిని. అది వడిగా బోవుటకు కరుకు ప్రదేశమెంతో యావసరము. అది బురదలోకి బోయినప్పుడు పొలుసులతో పట్టుకొనుటకు తగిన కరుకు ప్రదేశ మచ్చట లేనందున కొంచెమైనను ముందుకు బోలేకపోయెను.

అది నడుచుటకు పూర్వము చాల కష్టపడి యుండవచ్చును గాని చివర కెట్లయినను అది నేర్చుకొనినది. ఏలాగు నడువవలెనో పాములకే అన్ని జంతువులలోను సరిగా తెలియునని తలంచుచున్నాను. ప్రతి వారును తమ పొట్టమీదపడి ప్రాకవలెననుచున్నానని తలంచకుడి. గాని ప్రతి పిల్లవాడును పెద్దవాడును తాను త్వరగా బోవుటకు కొంచెము కరుకుగానుండు ప్రదేశములను వెదకుచున్నాడు. నున్నని ప్రదేశములలో బోవుట సులభ మనుకొనువారు త్వరగా బోనేరకుండుటయే గాక పడుటకును వీలగుచున్నది.

# బైబిలు పిల్లలు

## యెహోషువా



బాలమిత్ర చదువరులారా! మీరిదివరకే యెహోషువాను గురించి కొంతవరకు చదివియుంటిరి. ప్రభువునందు అతడు నమ్మకముగాను విధేయతగాను జీవించి, ఇశ్రాయేలీయులతో నెట్లు ఎరిఖోను జయించి స్వాధీనపరచుకొనెనో చూతము. ఎరిఖోను సమీపించుటకు మొదట యొర్దాను

దాటవలసివచ్చెను. మొదట యాజకులు తరువాత ప్రజలు యొర్దాను తీరమున నిలిచియుండు నీళ్లు అటు ఇటు రాశి వలె ఏర్పడి వారు దాని దాటునట్టుల చక్కని త్రోవ ఏర్పడెను. వారంతా యొర్దాను దాటుసరికి నదీజలము ఎప్పటివలె కలసిపోయెను. వారు నదీతీరమున జ్ఞాపకార్థముగా కొన్ని రాళ్లుపాతిరి. తర్వాత యెహోషువా, జనములను యెరికో చుట్టు ఆరు దినములవరకు మౌనముగా తిరుగుమని యెహోవ ఆజ్ఞప్రకారము విధించెను, చూచితిరా! ప్రభువునకు యుద్ధములు, జగడములు సలుపుట ఇష్టములేదు. సమాధానముతో సమస్తము జరుగునట్టుల ఇష్టపడును. గనుక తన ప్రజలగు ఇశ్రాయేలీయులు ఎరికో ప్రజలతో పోట్లాడునట్లుగాక వారి యూరి గోడచుట్టు మౌనము దినమునకొకసారి ఆరుదినములు తిరుగునట్లును, ఏడవదినము ఆరుసార్లు మౌనముగా చుట్టుతిరిగిన తరువాత ఏడవమారు బూరలనూది ప్రజలు ఎలుగెత్తి కేకలు వేయునట్లును ఆజ్ఞాపించెను. వారట్లే జేసిరి. ప్రభువు తన ఆజ్ఞలను సంపూర్ణముగా గైకొనువారికి బ్రతుకులో ఆశీర్వాదములను, జయములను అనుగ్రహించును. యెహోషువాయు, అతని ప్రజలును ప్రభువుయొక్క మాటచొప్పున చేసినందున ఎరిఖోను బహు సులభముగా స్వాధీనపరచుకొనిరి. అందలి

ప్రతివస్తువు కాల్చివేయబడి నాశనపరచబడెను. వెండి బంగారములు మాత్రము కాల్చబడి పవిత్రపరచబడిన తరువాత ప్రభు సేవకు వినియోగించబడెను.

బాలమిత్రులారా! యెహోషువా నమ్మకమైన సేనానాయకుడుగా ఇశ్రాయేలీయులకు ప్రభువు ప్రమాణపూర్వకముగా నిత్తుననిన పాలు తేనెలు ప్రవహించు కానాను ప్రదేశమును జేర్చి వారికెన్నియో హితబోధలు జేసి వారిని సన్మార్గమున నడుపుచువచ్చెను. ప్రభువు భక్తులు ఇతరులను సహితము తప్పిపోకుండునట్లు వారికి ప్రభువునుగురించి చెప్పి నీతిమార్గమున నడుచుటకు సహాయము జేతురు. బాలురారా! బాలికలారా! మీరు ఇతరులకు ఈవిధమైన సహాయము జేయుచున్నారా!

---

## బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రా!

గోలేపల్లి అను గ్రామపు బడిపిల్లవాడనగు పుల్లెటికుర్తి రవివర్మ అనేక సలాములతో వ్రాసుకొన్న సంగతులు:—అయ్యా నేను బాలమిత్రలను చదువుచున్నాను. ఒక ఉత్తరము వ్రాయవలెనని అనుకొంటిని. ఇప్పుడు ఈ యుత్తే

రము వ్రాయుచున్నాను. నేను సి. బి. మిషన్ స్కూలులో చదువుకొనుచున్నాను. మేము ప్రతి ప్రొద్దుటి సాయంత్రము ప్రార్థనచేసి కీర్తన పాడుతాము. మా మేనేజరు పి. సోమ లింగంగారు ప్రతి శనివారము 10 గంటలు మొదలు 11½ గంటలు వరకు దేవుని వాక్యములు నేర్పుచు బోధింతురు. భీముని పట్నంలోయున్న ఇ. ఇ. ఉడ్మెన్ మిశమ్మగారు బాల మిత్రలను మాకు ఇస్తారు. నాకు 10 సంవత్సరములు ఉన్నవి. దేవుడు ఈ 10 సంవత్సరములు సుఖముగా కాపాడినందుకు ఆయనకు వందనములు. దేవుని కృపవల్ల మూడవ తరగతి చదువుచున్నాను. మా బడిలో అయిదు తరగతులు ఉన్నవి. మా బడి హెడ్మేష్టరు పి. రత్నమ్మగారు మరి ఇద్దరు సృష్టికరణము మేష్టరు కలరు. మేము దేవుని గురించిన సంగతులు ఎక్కువగా నేర్చుకొని ఎక్కువ వృద్ధిలోకి రావలయునని కోరుచున్నాను. మా బడిలో 52 కుర్రవాళ్లు గలరు. ఇందులో 7 ఆడపిల్లలున్నారు.

ఇట్లు తమ ప్రియబాలమిత్రుడు,

పుల్లెటికుర్తి రవివర్మ,

పోశేపల్లి.

C. L. S. PRESS, MADRAS—1917